# భక్త జనాబాయి

[ నాటకము ]



'విద్వాన్, కవివల్లభ'
మేడిపల్లి లక్ష్మీకాంతము

# భక్త జనాబాయి

[ నాటకము ]



'విద్వాన్, కవిచంద్ర'
మేడిపల్లి లక్ష్మీకాంతము

# కృతి సమర్పణము

సీ. తను భిన్నమయ్యు నద్వైతసరణి నెవ్వ
రేకాత్మకాఁగూడి యెసగినారొ
కర్మసంచితముగఁ గల్గు నా జన్మ కే
దంపతుల్ హేతువై తనరినారొ
కావ్యకర్తలుసయ్యుఁ గావ్యభర్తలుకాఁగ
గవిత నా కెవ్వారు గఱపినారొ
ఉగ్గుతో శ్రీరాము నుపదేశ మొనరించి
జన్మ సాఫల్యంబు సలిపినారొ

తే. గీ. అట్టివారలు పూజ్యులు నైనవారు
పార్వతీ నారసింహుల పాదపద్మ
ములకు నీకృతి సర్పించి మ్రొక్కువాఁడ
భక్తిశ్రద్ధల నానృణ్యపరత మిగుల.

ఇట్లు ప్రియపుత్రుడు
గ్రంథకర్త

## ఇందలి పాత్రములు

| | | |
|---|---|---|
| జనాబాయి | : | కథానాయిక |
| విఠోబా | : | జనాబాయి తండ్రి |
| నామదేవులు | : | జనాబాయి గురువు |
| రాధాబాయి | : | నామదేవుల భార్య |

శ్రీకృష్ణుఁడు, భక్తులు మున్నగువారు వత్తురు.

షరా :—అనుబంధ మున్నచోట పాటలు పాడవలెను.

## తొలిపలుకు

ఈ నాటకమునకు శరీరము జనాబాయి చరిత్రము. ఈ చరిత్ర మహాభక్తవిజయమునుండి గ్రహింపబడినది. ఈ జనాబాయి శ్రీ పాండు రంగస్వామి భక్తులలో నగ్రగణ్యురాలు. సామాన్యముగా బురుషభక్తు లందు ప్రీతికన్న జ్ఞానసంపదయే యెక్కువ. అది పురుష ప్రకృతి కనుగుణమై యుండవచ్చును. ఈమెయందు జ్ఞానమునకన్న ప్రీతి యధికము. ఇది స్త్రీ జన స్వాభావికము. ఈమెయందు జ్ఞాన సామగ్రిని సమకూర్చుటకే నామదేవు డీ నాటకమున గూర్పబడి సార్థక మగుచున్నాడు. తన భక్తిచే నితరులనుగూడ భక్తుల గావింపగలిగినప్పుడే భక్తికి పరమస్థితి యేర్పడును. ఇట్లేర్పడుట యొక భక్తికేగాదు ప్రతిరసమునకును. పర్యంత పరసీమయగు స్థితి యట్టిదియే. కావుననే యుత్తర రామచరితము నందలి కరుణరసము అత్యుదాత్త భూమిక నందకలిగినది. అచటి శ్రీరామ చంద్రుని కరుణ దర్శనముచే సీత తన దుఃఖమునుగూడ మరచిపోయి తన ప్రియుని దుఃఖముచే దుఃఖితురా లగుచున్నది. ఇట్లే యితర రసముల విషయమునగూడ సంభావించుకొనవలయును. ప్రకృతములో నామ దేవుని సతీతిలకమగు రాధాభాయి శ్రీ జనాబాయి భక్తిరసమున దాను గూడ శ్రీ విఠలుని భక్తురాలుగా మారుచున్నది. మొదటి యంకమును నాల్గయిదు అంకములను బరిశీలించుచో రాధాభాయియందు గల ఈ మార్పు గోచరమగును. కనుకనే ఈ రాధాభాయి పాత్ర కీనాటక మున సార్థకత్వ మొదవినది. ఇట్లు భక్తిరసమున మనముగూడ ధన్యుల నొనర్పదలంచియే ఈ గ్రంథకర్త ఈ గ్రంథమును రచించెను. ఇది చక్కని శైలిలోనుండి "సారమతిం గవీంద్రులు బ్రసన్న కథా కలితార్థ యుక్తి లో నారసి మేలునాన్" అని నన్నయ భట్టారకుని నుడిని దనలో నలవరచు

కొనియున్నది. ఈ ప్రసాదమను గుణమును "సకలరస సాధారణమును సకలరచనా సాధారణమునుగా సహృదయ చక్రవర్తి యగు నానంద వర్ధనాచార్యులు నిరూపించిరి. ఇట్టి ప్రసన్న రమణీయమగు కవితా ధారతో నీ కవి యీ జనాబాయి చరిత్రమును నాటకమునుగా రచించి మన నేత్రేంద్రియములకు "కాన్తం క్రతుం చాక్షుషం" అనినట్లుగా యజ్ఞమును సమకూర్చి ఆనందము, పుణ్యము, భక్తి, మోక్షముగూడ సమకూరున ట్లొనర్చినాడు. ఇట్టి కవి చంద్రున కితోధిక శ్రేయస్సుల సమకూర్చి యింకను నిట్టి మృదుమధుర శైలిగల గ్రంథములు రచింప జేసి శ్రీ విఠలస్వామి తన కైంకర్యమును నెరవేర్చుకొనుగాత మని యాశించుచున్నాను.

> "భోక్తారం యజ్ఞ తపసాం సర్వలోక మహేశ్వరం
> సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తి మృచ్ఛతి
> స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః"

గుంటూరు
10–1–45

శిరోమణి వేదాల తిరువెంగళాచార్యులు,
సంస్కృత పండితుడు, ఏ. సి. కాలేజి.



# పండితాభిప్రాయములు



శా. లోకుల్ విన్నను గన్ననుం గడుఁ జవుల్ బుట్టన్ జనాభాయి భ
క్త్యాకారంబగు నాటకంబు మృదులంబై నట్టి వాగ్ధారతో
సాకల్యంబుగ నొక్కభంగి రచనా సారస్యమింపొంద ల
క్ష్మీకాంతాఖ్య కవీశ్వరుండు రచియించెన్ దీనిమెచ్చన్ బుధుల్.

చం. మృదులములై వినం జెవులకింపగుచున్ సమయోచితంబులౌ
పదముల కూర్చుగల్గి రసభావ విశేష విభూషితంబునై
సుహృదులు మెచ్చుకోఁదగి విశుద్ధచరిత్రముతోడఁ గూడి యి
య్యది యొక చిన్న నాటకమెయయ్యు ఘనంబగు పేరుదెచ్చెడిన్.

కం. మును వెనుకల గణములలో
నెనసిన కడయక్కరంబుఁ లితరగణముతో
ననుసంధించుట, కవి ల
క్షణ విజ్ఞాన స్వతంత్రగతి నెఱిఁగించున్.

హైదరాబాదు
1—6—37

ఇట్లు
శ్రీ వనపర్తి సంస్థానాస్థాన విద్వత్కవి
శతావధాని
నెమలూరి వేంకటశాస్త్రి

* * *

శా. వీకం బెద్దల సేవచేసితివి, సద్విద్యాశ్రీ నార్జింప, సు
శ్లోకంబున్ గడుఁ బెంప సత్కవితకున్ జోటిచ్చితీ వద్దిరా!
శ్రీకాంతుండు, నుమామనోహరుఁడు రక్షింపంగ నున్నారు, ల
క్ష్మీకాంతా! భవదీయ వాగ్లహరి వాసింగాంచు నెక్కాలమున్.

జగ్గయ్యపేట
15—5—1940

ములుగు వీరభద్రశాస్త్రి.

ఇది భగవద్భక్తిని నిరూపించు చక్కని నాటకము. ఇందు వైష్ణవ భక్తి ప్రతిపాదితమైనను ఆయా స్థలములలో శివనామములను శైవులు భావించవలెను.

సికింద్రాబాదు
1936

చిదిరెమఠము వీరభద్రశర్మ
సంపాదకులు 'విభూతి'

* * *

శ్రీ మేడిపల్లి లక్ష్మీకాంతకవి మాకు సతీర్థ్యుడు, చిరకాల మిత్రుడు. ఈయన రచనలు చాలవఱకు అముద్రితములు. "నాకవనము" అని చక్కని కృతి రచించినారు. అది పలువురి పండితుల మెప్పుగాంచినది.

ప్రస్తుత కృతి భక్తజనాబాయి నాటకము మునుపు "విభూతి" పత్రికలో ప్రకటింపబడినది. "విభూతి" అనగానే శివసాయుజ్యమందిన శ్రీ చిదిరెమఠం వీరభద్రశర్మగారు అమృత హృదయులు జ్ఞాపకము వచ్చుచున్నారు. ఆయన ప్రోత్సాహమునందని కవులా రోజులలో లేరు. మా లక్ష్మీకాంతముగారి రచనలు ప్రతిభాన్వితములు, ఆయన దృష్టి నాకర్షించుటలో ఆశ్చర్యములేదు.

ఈ నాటకము ఒక విధముగా త్రివేణీ సంగమము- శ్రీపాండురంగ విఠలుని కృపాస్రవంతి, మా లక్ష్మీకాంతకవి ప్రతిభా ప్రవాహము, ప్రసన్న భక్త కథావాహిని: ఈ మూడును గంగా, యమునా, సరస్వతులు.

మా లక్ష్మీకాంత కవి ఇంకను ఉత్తమ కృతి రచనాధురంధరు డనిపించుకోవలెనని మా ఆకాంక్ష.

శ్రీనివాస సోదరులు,
శతావధానులు.



# భక్త జనాబాయి

## నాటకము

## ప్రథమాంకము



నాంది

శా. శ్రీరాధా హృదయారవింద సరసస్నేహోజ్జ్వలస్వాంత మా
యా రామామణులందుఁ బ్రోదిగని, యాయా తియ్యనౌ నేళ్లతోఁ
బారావారముగాఁగ రంజిలుడుఁ గుబ్జన్ గాంచి మిన్నంది నా
నారమ్యాకృతులం జరించుఁ దమిఁ గృష్ణబ్రహ్మ మీక్షించెదున్.

(ప్రథమ రంగకము - పండరిపుర వీథి)

భక్తులు : (భగవంతుని గీర్తించుచుఁ బ్రవేశించి దేవాలయమున కరుగు చుందురు.)

౧ వ అనుబంధము

౨ వ అనుబంధము

(విఠోబా, జనాబాయి ప్రవేశింతురు)

జనా : తండ్రీ! పండరిపురి కరుదెంచితిమి. శ్రీరుక్మిణీకాంతు నాలయమున కేగుట కిం కెంత తడవగును? (పరికించి) అరుగో! భక్తు లెల్లరు శ్రీహరినామ సంకీర్తనమునఁ దన్మయులై కోవెల కేగు చున్నారు. మనమును వీరినిఁ గలిసి సకల దుఃఖఘ్నమగు విష్ణు కీర్తనమున స్వామిని దర్శింతము.

విఠో : (జనాబాయితో నడచుచు) అమ్మా! చూడు మదియే గోపురము! అల్లదియె కోవెల! ఆ కనఁబడునదియె భక్తగోష్ఠి.

తే. గీ. పండరీనాథు భక్తి హృత్పద్మమునను
నిల్పి, తన్మయులై, కడు నిశ్చలాత్మ

నామదేవాదిభక్తు లనవరతంబు
సేయు భజనామృతము గ్రోలు చెవులు తనియ.

భక్తులు : (పాండురంగని గుడిలోఁ బ్రవేశింతురు)

జనా, విఠోభా : (సింహ ద్వారమును దాటి గుడిలోఁ బ్రవేశింతురు)

జనా : ఆహా ! ఏమీ లక్ష్మీవల్లభు నాలయము ! ఏమీ తాళమృదంగాది సంకీర్తననిస్వనము ! ! రమాకాంతా ! ఆద్యంతరహితా ! త్రిగుణాతీతా !

కం. తనువాఙ్మనఃక్రియల నిను
ననయము భజియించి తనియ నబలలకైనన్
గన నొండు తలఁపు గలుగునె ?
మునినుత ! లక్ష్మీశ ! విబుధపూజ్యా ! ముకుందా !

భక్తులు : (వీరిని దర్శింతురు)

౧ వ భ : ఆహా ! ఏమీ తన్వి భక్తి పారవశ్యము ! పదునాలేండ్ల లేఁబ్రాయమున నింతభక్తి నార్జించి వేదవేదాంగాది సమస్తగ్రంథార్థముల నెఱింగిన దీ నారీరత్నము. భక్త శిరోమణి. ఆనందము ! పరమానందము !

భక్తులు : (వీరికి నమస్కరింతురు)

జనాబాయి, విఠోబా : (పునరభివాదము గావింతురు)

౨ వ భ : అయ్యా ! తమ నామంబులఁ బవిత్రములైన వర్ణముల వినఁ గోరెదము.

విఠో : అయ్యా ! నా పేరు విఠోబ. ఈమె నా కూతురు జనాబాయి.

౩ వ భ : తల్లీ ! మీతోడ మేమును హరిని భజింతుము. పాండురంగ సంకీర్తనమున మమ్ము ధన్యులఁ గావింపుఁడు. భక్తిమార్గమును నెలకొల్పుఁడు.

జనా : భక్తులారా ! రండు. భగవత్సాన్నిధ్యమును జేరి హరినిఁ గీర్తింతము. (౹౭ వ అనుబంధము) (అందఱుఁగలిసి పాడుదురు)

జనా : (స్వామికి నమస్కరించి) హా ! జగద్రక్షకా ! ఆపదుద్ధారకా ! !

తే. గీ. ఎల్ల పౌరాణికాళిచే నెఱిఁగినటుల
విమలభక్తాళిపొందున విన్నటుల, స
కలశుభాకార ! రుక్మిణీకాంత ! నీదు
మంగళాకార దర్శన భాగ్య మబ్బె
నేత్రయుగ్మంబు కలిమికి నెగడె ఫలము.

విఠోబా : శ్రీ పాండురంగా ! పండరీనాథ ! ! రక్షింపుము.

(అర్చకుడు తీర్థ ప్రసాదము లొసంగును)

విఠోబా : అమ్మా ! మన మిల్లు వాకిలి విడిచి చాలదినములైనవి. గొడ్డు గోద పైరు పంట లేమాయెనో ! పాండురంగని దర్శించితిమి. ఇఁక పోవుదము రమ్ము.

జనా : తండ్రీ ! ఎక్కడికి ?

విఠోబా : అమ్మా ! అటు లనెదవేమి ?

జనా : జనకా !

తే. గీ. ఏ స్థలంబును జేర మునీశ్వరులు ప్ర
విమలచిత్తానువృత్తులై వేలవర్ష
ములు తపంబు సేసెద రధోముఖములుకాఁగ
నట్టి పరమపదవి వీడు టెట్టి తగవు ?

విఠోబా : కుమారీ ! సకలవ్రతముల నొనర్చి నీజనని తన పశ్చిమవయసున నినుఁ గని పురిటిల్లైనను విడువక మునుపే దివంగతయయ్యె. నాటినుండి యీనాఁటివఱకు నీవ నా కేడుగడయని యల్లారు ముద్దునఁ బెంచుకొనుచుంటిని. నీ ముద్దులెల్లఁ దీర్చుచుంటిని. నీ కోరిన కైవడిఁ బండరికిని దోడ్తెచ్చితిని. అట్టి నీ తండ్రిని విడుచుట తగవుకాదు. పసిబిడ్డవు. కసికందువు. అమ్మా ! జనాబాయి ! నామాట వినుము. నా ప్రేమబంధ మిపు డీవు వదలుమన్న వదలునా !

జనా : అయ్యా !

ఉ. ఎవ్వరు తల్లిదండ్రు లిఁక, నెవ్వరు సోదరు లేరు చుట్టముల్
ఎవ్వరు స్నేహితుల్ తలప ? నెవ్వని కెవ్వఁడు ? మిథ్య సర్వమున్

ఇవ్వసుధన్ బుణంబు నశియించెడుదన్కనె ప్రేమబంధముల్
చివ్వునఁ బాండురంగవిభుసేవఁ దొలంగు సమస్తబంధముల్.

విఠో : కుమారీ ! ఏల యిట్టి యనర్థవాక్యము లాడెదవు ? నీకుఁ దగిన వరుని గొనితెచ్చి యిల్లటముంచుకొని మీ ముద్దు మురిపములను ముచ్చటగాఁజూచి మురియనున్న నాకీయాశాలతను వమ్ము సేసెదవా ? కట్టా ! జాయావియోగానల సంతప్తహృదయమున కీ సంతాన వియోగమును గోరుచుట్టుపై రోఁకఁటిపోటువలె బాధించుచున్నదే ? పుత్రీ ! పుత్రీ ! 'మాతృదేవోభవ, పితృదేవోభవ' యను సూక్తి నెఱుఁగవా ?

జనా : జనకా ! ధర్మశాస్త్రములు పరస్పర విరుద్ధములు కావు ! కావు !! అగాధములు. కించిజ్ఞుల కగ్రాహ్యములు. సర్వజ్ఞులగు మీ బోంట్ల కే నేమని చెప్పఁగలను ? కరుణించి నన్నిట వదలుఁడు.

ఆవ భ : అయ్యా ! ఈ బాలిక నేల సంసారసాగరమునఁ బడద్రోసి దిక్కుగానక పరితపింపఁజేయుదురు ? పురాకృత ఫలమున నింత పిన్న వయస్సున నిట్టి విరాగిణియగుట నెంతయు ధన్య. ధన్యులలో ధన్య. ఇట్టి యుత్తమాంగన హృదయమును నొప్పింపకుఁడు. భక్తులు తపించిన భగవంతుడు బాధచెందును. సర్వాంతర్యామి సర్వేశ్వరుఁడు మీబిడ్డను దనబిడ్డవలె రక్షించుకొనును. మామనవి నాలించి మమ్ము క్షమింపుఁడు.

విఠోబా : (దీర్ఘముగా నాలోచించి నిట్టూర్పువిడిచి) హా! పాండురంగా! పండరీనాథా ! !

తే. గీ. నీదు వరలబ్ధ బహుముగ్ధ, నీదుభక్తి
పరవశంబున నెగడొందు భక్తురాలు,
నాదునేకైక పుత్రిక, నీదు పాద
సేవనాకాంక్ష నెటులఁ బ్రోఁచెదవొ దేవ !

పుత్రీ ! పాండురంగఁడు నిన్ను రక్షించుగాత ! (నిష్క్రమించును)

జనా : (దైన్యముతోఁ దండ్రిని వీక్షించి భక్తులను దిలకించి) భాగవతోత్తములారా! ఇఁక నిశ్చింత నీ పాండురంగస్వామిని భజించి తరించెదను.

౧ వ భ : అమ్మా! అచిరకాలంబున భగవత్ప్రసాదపాత్ర మయ్యెదుగాత! మే మిఁకఁ బోయివచ్చెదము.

(భక్తులతో నర్చకుఁడును నిష్క్రమించును)

జనా : (౮ వ అనుబంధము పాడుచుండును)

నామదేవుఁడు : (౫ వ అనుబంధముతోఁ బ్రవేశించి స్వామికి నమస్కరించును) పుండరీక వరదా! పురాణపురుషా!!

తే. గీ. కమలదళనేత్ర! రుక్మిణీకాంత! చక్రి!
కౌస్తుభమణిభూష! దనుజకంఠలుంఠ
నా విహార! యో సచ్చిదానందరూప!
భవ్యసందర్శనంబిమ్ము పాండురంగ!

(విగ్రహమును బరికించి) ఏమీ! భక్తావనుఁడగు నా దేవుఁడు పలుకకుండుటకుఁగల కారణమేమి? రుక్మిణీలోలుఁడై యున్నను నా ప్రార్థన వినినంత నకె యురికివచ్చు నారంగడు నాకు నేనై తన యాలయమును జేరి మొఱపెట్టుకొన్నను బ్రత్యుత్తర మీయఁ డేమిపాపము! (ఆలోచనముతో విగ్రహమును బరిశీలించి) ఆ! తెలిసినది. రంగా! ఏ రక్కసుఁడు నీ భక్తున కిక్కట్లొనగూర్చె? ఏతన్వి నిన్నుఁ దన హృత్పద్మమున బంధించి మమ్ము గాఢాంధకారమునఁ ద్రోసె. నాకింత జ్ఞానజ్యోతి నొసఁగితివా యేతన్మయూఖస్పర్శనమున నా సారసామృతమును గ్రోలితనియు నినుఁజూడఁగందును. హా! రంగా! రంగా!! (ధ్యానమొనర్చి, జనాబాయిని దిలకించి) ఈ బాలామణి యెవ్వరో! అఖండ తేజఃప్రభాసినియై వెలుఁగుచున్నది. సమస్తకల్యాణగుణంబుల కాటపట్టై, నిర్వికారయై, నిశ్చలతత్త్వంబునఁ జెన్నారు

పరమానంద స్వరూపిణి తానై భగవన్నివాసమున కాలయ మైనది. "అన్యజన్మని సర్వాత్మా విష్ణు రభ్యర్చితో మయా" అను రీతిని నీ బాలిక సర్వశరీరి యగు విష్ణువును బూర్వజన్మమునఁ జక్కఁగా నారాధించి యుండనోపు! కాకున్న నెట్లు భగవత్సన్నిధినిగూర్చుండి భగవద్ధ్యాన మొనర్చి తనకు వశ్యునిగా నొనర్చుకొనఁగలదు? (డాసి, శాంతగంభీర స్వనమున) బాలామణీ! భక్తశిరోమణివలెఁ గన్పట్టు నీ వెవర్తెవు? నీ తలిదండ్రు లెవరు? నీ పేరేమి?

జనా : ఆర్యా! నా పేరు జనాబాయి.

తే. గీ. పండరీనాథుఁడే తండ్రి, పరమ పావ
ని యగు రుక్మిణియే జనని, అఖిలహరి
భక్తులే బంధువర్గంబు, పాండురంగ
నామభజనామృతమె జీవనామృతంబు.

నామ : ధన్యోస్మి! ధన్యోస్మి!! నారీరత్నంబవగు నిన్ను గాంచ నాకెంతయు నాహ్లాద ముదయించుచున్నది. "సత్సంగత్వే నిస్సంగత్వం, నిస్సంగత్వే నిర్మోహత్వం, నిర్మోహత్వే నిశ్చలతత్త్వం, నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః" కాన నాతోడి ప్రసంగమున నీకును నానుకు మేలయ్యెడిని. జ్ఞానాన్వేషణమునకుఁ దావయ్యెడిని. భక్తిజ్ఞానమున నీ మనోరథం బీడేరును. నీ జన్మము ఫలించును. మీబోఁటి భక్తగోష్ఠిని నేను సర్వదా యాసింతు. నాయింట నుందువు రమ్ము. నన్ను నామదేవు డందురు.

జనా : చిత్తము.

నామ : }
జనా : } (స్వామికిఁ బ్రదక్షిణించి వెళ్ళుదురు.) (౨ వ అనుబంధము)

(యవనిక వ్రాలును.)

(ప్రథమాంకము సంపూర్ణము)

# భక్త జనాబాయి

## ద్వితీయాంకము

### ప్రథమ రంగకము

(నామదేవుని గృహమున రాధాబాయి గుడ్డలు కుట్టుకొను చుండును.)

రాధా: కట్టా! ఈ దారిద్ర్యము మమ్మెన్నడు బాయునో! సకల దురితములకు మూలము లేమిడి యని నీతికోవిదులు వక్కాణింతురు. అరుగో! బాలు రాఁకలి కల్లలాడుచున్నారు. పశు పక్ష్యాదులు సహితము తమ బిడ్డల క్షుద్బాధను దీర్పఁగల్గు చున్నవి. కానిఁ నాబోఁటి తల్లి పక్షికన్న నన్యాయముగదా! పతియో! ఎల్లప్పుడుఁ బాండురంగని వలలోఁ దగుల్కొని తన్మ యుఁడై యున్మాదునివలె నుండును. అదేమన? 'మాతా నాస్తి, పితా నాస్తి, నాస్తి బంధు స్సహోదరః, అర్థం నాస్తి గృహం నాస్తి' యని యేమేమో యుపన్యసించి, పుట్టించినవాడు పోషింప నేరఁడా, నీకేల యీచింత? నీవేల యీ యీషణత్రయమున మునిఁగెదవు? పురాకృత ఫలము నితరు లనుభవింతురా? ఏరిది వారిదే. ఈ సంసారసాగరమునుండి దరిఁజేరుటకు శ్రీమత్పండరి నాథుని నామ స్మరణమే నావ, దిక్కు, ముక్తి అని మైమఱచి కోవెల చేరును. ఎట్లో లభ్యమైన దానితో నీపూట గడుపుద మన్నను, భక్తగోష్ఠి, గార్హస్థ్యధర్మమని, యావేళ కీవేళ కెవ రెవరినో తోడ్తెచ్చును. పేదవానికిఁ బిల్లలు. తద్దినానికిఁ గూరలు. అయ్యో! నే నేమి చేతు!

చ. కొడుకులు వేళతప్పుటను గూఁటికినై వెతచెంది నిత్యముౕ
సుడివడ నేడ్చినన్ గడకు సొజ్జెయు గంజియు నీయనట్టి నా
కడుపు ఫలింపకున్నఁ బరకాంతల బిడ్డల నాదరించుచుౕ
ముడుపులు గట్టు భామలకు, బుట్టఁగ నేర్తురె పుత్రు లెవ్విధిౕ?

అదుగో! నా నాథుఁ డూరకే వచ్చుచున్నాఁడు. నేనేమి చేయుదును? పాండురంగా! నీవె దిక్కు.

నామ :
జనా : } (ప్రవేశింతురు)

రాధా : (లేచి సాదరముగా నమస్కరించును.)

నామ : సతీ! రాధాబాయి! నాకీదినమున నొక రత్నము లభించినది.

రాధా : నాథా! రత్నమా! అట్లైన నిఁక మన దారిద్ర్య మీడేరును.

నామ : ఒక మన దారిద్ర్యమేకాదు. ఈ రత్న దీపికచేత మన యజ్ఞానాంధకారము సయితము మడుగంటును. (జనాబాయిని జూపించి) ఇదియేరత్నము, నారీరత్నము, భక్తరత్నము. నా భాగ్యవశమున నాకీ సుశీలతోడి సద్గోష్ఠి లబ్ధమయ్యెను. భగవద్భక్తులు తన్ను సంకీర్తన మొనర్చుచోట కమలాకాంతుడు కాపురము సేయును. ఇఁక మనకేమి కొదువ?

రాధా : (ఆశాభంగముతో) మంచిది. అపరాహ్ణమైనది. చంద్రభాగ నదినుండి మంచినీళ్ళబుంగ యొక్కటి తెచ్చితిని. తండులములే తక్కువ.

నామ : వెఱ్ఱిదానా! నన్నడిగెదవేల? శ్రీమత్పాండురంగని నడిగి తెచ్చుకొమ్ము. పొమ్ము.

రాధా : చిత్తము. (జనాబాయిని జూచి) అమ్మా! యీ చాపపైఁ గూర్చుండుము. (నిష్క్రమించును)

జనా : (కూర్చుండును.)

నామ : (సుఖాసీనుఁడై) జనాబాయీ!

తే. గీ. పిల్లుపీచర పల్లేరు బీడువోలెఁ
గామ క్రోధ లోభాది సంగతులు లేని
కేవలానంద సారహృత్క్షేత్రమందు
భక్తిబీజంబు నాటి తత్ఫలము గందు.

జనా : మహాత్మా! తావక కృపావిశేషంబున ననుగ్రహింపఁబడితిని.

నామ : నీకు జ్ఞానమార్గమును, భక్తిమార్గమును బోధించెద వినుము.

జనా : స్వామీ ! భక్తియన నేమి ?

నామ : నిర్గుణ బ్రహ్మస్వరూపము సామాన్యజనులకు దుర్బోధము. శ్రద్ధయు, బుద్ధియు, జ్ఞానప్రాప్తికి సాధనములు. ఈ రెంటికిఁ బరస్పరాపేక్ష కలదు. శ్రద్ధచేఁ బరమేశ్వరజ్ఞానము కల్గినను నిర్వాహకము గానేరదు. అది మనస్సునకుఁ దెలియుటకయి, నిరతిశయము, నిర్హేతుకమునగు ప్రేమచేఁ బరమేశ్వరుని జింతింప వలయును. దీనినే భక్తియందురు.

జనా : గురువర్యా ! గ్రహించితి.

నామ : అమ్మా ! "సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ, అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః" ఇతర ధర్మముల నన్నిఁటిని వదలి నన్నొక్కనినే శరణుపొందుము. నేను నిన్ను సర్వపాపములనుండి విముక్తునిగావింతును, దురపిల్లకుమని భగవద్గీత నుడువుచున్నది. మఱియు నీగీత భగవద్భక్తులను నాలుగు విధములుగా విభజించెను. వారిలో నర్థార్థి క్రిందిమెట్టులోనివాఁడు. రెండియుఁ బరమేశ్వరుని దెలిసికొనుటచే సంపాదించు కొనవలసిన దేదియు లేకపోయినను నారదాదులవలె జ్ఞాని యితర నిష్కామకర్మల నాచరించునట్లు, కేవల కర్తవ్యబుద్ధిచేఁ బరమేశ్వరుని నెవఁడు భజించునో వాఁడే సర్వభక్తులలో శ్రేష్ఠుడు. ఇదియే భాగవతపురాణమునందు, "శ్రవణం, కీర్తనం విష్ణోః, స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, ధ్యానం, సఖ్యమాత్మనివేదనం" అని తొమ్మిదివిధములుగాఁ జెప్పఁబడియున్నది.

జనా : గురువర్యా! సగుణోపాసన నిర్గుణోపాసనములం దెయ్యది యుత్తమోత్తమము ? కొందఱు విగ్రహారాధన కూడ దందు రేల ?

నామ :

శ్లో. అక్షరావగమలబ్ధయే యథా స్థూలవర్తులదృషత్పరిగ్రహః
శుద్ధబుద్ధపరిలబ్ధయే తథా దారుమృణ్మయశిలామయార్చనం.

అక్షరములను దెలిసికొనుటకై బాలురకు గుండ్రని జాతి ముక్కల నక్షరములుగఁ జెక్కి చూపించు విధమున, శుద్ధబుద్ధ పరబ్రహ్మ జ్ఞానము కలుగుట కొఱకు, కొయ్యలు, మన్ను, జాలతోఁ జేయఁబడిన విగ్రహముల స్వీకరించుచున్నారు. కాన, విగ్రహారాధన మవశ్య మాచరణీయము.

జనా : మహాత్మా! వ్యక్తోపాసన, అవ్యక్తోపాసనలకుఁ గల భేద మేమి?

నామ : వ్యక్తోపాసనమనఁగా భక్తిమార్గము. అవ్యక్తోపాసన మనఁగా జ్ఞానమార్గము. ఇవి రెండు నన్నదమ్ములవలెఁ బూర్వాపరములై నడచి వచ్చుచున్న సాధనములు. ఈ రెంటిలో భక్తియను సాధన మధిక సులభము. మూలమునందు 'ఏకమే వాద్వితీయమ్' అయిన పరబ్రహ్మము, ప్రేమయు, శ్రద్ధయు, మొదలుగఁ గల్గిన మనోమయములగు నయనములచే మనుజులకు గోచరమగును. ఈ స్వరూపమునే వేదాంతశాస్త్రమం దీశ్వరుఁ డనుచున్నారు. ఒక హరియే అంతటను వ్యాపించినవాఁడుగను, సర్వసముడుగ నున్నాఁడు. అయినను భక్తుల కొఱకు భగవంతుఁడు కొద్దివాఁడగు పాండురంగమూర్తి యగుచున్నాఁడు. 'బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాంప్రపద్యతే' 'వాసుదేవ స్సర్వమితి, స మహాత్మా సుదుర్లభః' ఒకసారి భక్తిమార్గము నవలంబించిన పిదప నీజన్మమునఁ గాకపోయినను మఱు జన్మమునను, ఆజన్మమున కానిచో మరుచటి జన్మమునను నొకప్పుడు కాకపోయినను మఱియొకప్పుడైనను, సర్వము వాసుదేవాత్మకముగనే యున్నదను పరమేశ్వర స్వరూపము యొక్క సత్యమగు జ్ఞానము మనుజునకుఁ గల్గును. ఆ జ్ఞానముచే నతనికి ముక్తి లభించును.

జనా : మహాత్మా! భాగవతశ్రేష్ఠుఁ డెట్టివాఁడు?

నామ : శ్లో. సర్వభూతేషు యః పశ్యే। ద్భగవద్భావ మాత్మనః
భూతాని భగవత్యాత్మ। న్యేష భాగవతోత్తమః.

నేను వేఱు, భగవంతుఁడు వేఱు, లోకులు వేఱను బుద్ధిని మనస్సున నుంచక, నేనును భగవంతుఁడును నొకటియేయను భావన నెవఁడు సర్వభూతములయం దుంచుచున్నాఁడో, సర్వభూతములు భగవంతుని యందును, దనయందును నున్నవని తెలిసికొనుచున్నాఁడో వాఁడు భాగవతులలో శ్రేష్ఠుఁడు కాన, నో బాలామణీ!

'కాయేన వాచా మనసేంద్రియై ర్వా। బుద్ధ్యాత్మనావా ప్రకృతే స్స్వభావాత్ । కరోమి యద్య త్సకలం పరస్మై। నారాయణాయేతి సమర్పయే తత్' అని శ్రీకృష్ణపరమాత్మ నుడివియున్నాఁడు. పరమేశ్వరునకు స్త్రీయైనను, బురుషుఁడైనను, చండాలుఁడైనను సమానులే. భగవంతుఁడు భావమును నాఁకలికలవాఁడు కాని, ప్రతీకమునకు సంబంధించిన వాఁడుకాఁడు కాన,

తే. గీ. పురుషుఁడైన శూద్రుఁడైనఁ బోఁతియైన
డాపనేటికి? కడకు చం డాలుఁడైన
భావమర్పించి, భజియించు భక్తుడైన
బొందు సుస్థిరమైనట్టి మోక్షపదము.

జనా: మహాత్మా! ధన్యురాలను ధన్యురాలను.

నామ: అమ్మా! నీవిటనుండుము. నేను నదికేగి వచ్చెదను (నిష్క్రమించును)

జనా: చిత్తము. (గృహములోని కేగును)

(యవనిక వ్రాలును)

ద్వితీయ రంగకము

[దేవాలయ వీథి]

రాధా: (ప్రవేశించును) దివారాత్ర విభాగములేక సదా భగవద్భక్తి సాగరమగ్నుడై యుండిన సంసారకార్యము లెట్లు జరుగును? నా పతివంటి భగవద్భక్తు లనేకులు లౌకిక వైదిక కార్యముల రెంటను సమర్థులై యుండలేదా? ఈ స్థితిమాత్రము వేఱొక విధముగా నున్నది.

తే. గీ. పట్టెడన్నంబు పొట్టకుఁ బుట్టకున్కి
కట్టపుట్టంబు నొక్కటి కలుగకున్కి
కన్నువొందక బిడ్డలు గాసిపెట్టు
నింటిలోఁ బోరు చెప్పుటఁ కెంతొసిగ్గు.

అదియునుగాక,

మ. బుతుకష్టంబుల కెల్ల యోర్చి యటవి న్నెప్రొద్దు శుష్కాంగినై
సతతంబొప్పు కుటీరవాసమున నా సౌఖ్యంబుతోఁ బుత్రులుꣳ
బతియుం దానును గందమూలములనే భక్షించుచుం దృప్తయౌ
సతికన్నం గొఱమాలినట్టి సతికిꣳ సౌఖ్యం బిఁకేమున్నదో.

పట్టణవాసినినైనను, పండితునర్ధాంగినైనను, మాయదారికృష్ణుని వలలోఁజిక్కిన మగనాలినగుట నా బ్రతుకు గహనాంతరవర్తిని యగు మునిపత్నికన్నఁ గష్టమయ్యెను కట్టా!

తే. గీ. పతియె హరియని నమ్మిన పడఁతినైనఁ
బ్రేమతో లాలనము సేసి ప్రియములాడ
నోపక, సుతులఁ బోషింప నోగిరం బొ
సఁగమిఁ గోరదే పరలోక సంగమంబు.

ఇంతకు నీ రంగఁడే కారకుఁడు. నీకు కావలసిన వన్నియు నీతఁ డిచ్చునని నన్నంపె. ఇదే వెళ్ళిచూతును. (నిష్క్రమించును.)

(యవనిక వ్రాలును.)

## తృతీయ రంగకము

*[పాండురంగని గుడి]*

రాధా: (ప్రవేశించి స్వామికి నమస్కరించును) రంగా! భవభంగా!! కరుణాంతరంగా!!! నా మొఱ నాలింపుము. నన్నుఁ గృపఁ గనుము. నా పతి సర్వదా నీధ్యానమునందేలి మమ్మాదరించుట మానినాఁడు. అనాథనాథుఁడవగు నీవు మమ్మి ట్లిడుమలఁగుడుప నగునా? నీ సేవఁజేయుచుంటిని. నీ యడుగులకు మడుగులొత్తు

చుంటిని. నాపతిని నాయందనురక్తునిగా నొనర్పుము. రంగా! మాట్లాడ వేమి? నే నిదుగో నిజము చెప్పుచున్నాను. నాపతి నాయం దనురక్తుఁడు కాఁడా? కానిచో—

తే. గీ. తల్లిదండ్రులఁ గొల్వని తప్పిదంబు
తరుణినిం బ్రేమఁ జూడని తప్పిదంబు
తనయులను గాచకుండిన తప్పిదంబు
నిక్కముగ వచ్చి పడును నీ నెత్తిమీఁద.

ఏమి? నేననునది తప్పిదమనుకొంటివా? బెదరింపనుకొంటివా? లేదు, సత్యమును వక్కాణించితి. (విగ్రహమును బరిశీలించి) ఆహా! సకల కల్యాణగుణసంపన్నుఁడగు నీ రుక్మిణీకాంతుఁడు కళావిహీనుఁడై కన్పట్టు చున్నాఁడే! స్వామినడిగి తండులములు దెచ్చుకొమ్మని నా పతి నన్నిట కనిపె. ఇఁక నే నెవ్వరి నడుగుదును! హా! దైవమా! నిజము విచారింప నీ భక్తులు నీకు దాసులుగారు. నీ భక్తులకే నీవు దాసుఁడవు. అయ్యో! వేళ యతిక్రమించుచున్నది. ఈ విగ్రహముకడ మొఱపెట్టుకొన్న నేమి లాభము? ఇప్పుడే వెళ్ళి నీ దేవుఁడే భిక్షాటనముకేగెనని యెఱిఁగింతును. (నిష్క్రమించును).

(యవనిక వ్రాలును)

## చతుర్థ రంగకము

[నామదేవుని గృహము]

రాధా: (ప్రవేశించును) కట్టా! నేనేమిచేతు? నాపతి యెందరిగెనో! పాండురంగఁ డిచ్చునని పరుల నింట నాతిథ్యమున కుంచినాఁడు. ఇఁక నేనెట్లు వారి కతిథిసత్కార మొనర్తును?

జనా: (ప్రవేశించును) అమ్మా! ఎవరో యొక వర్తకుఁ డరుదెంచి తాను నామదేవులవారి కాంతరంగికుఁడనని సమస్త సంభారముల నిచ్చి చనినాఁడు. అప్పటినుండి మీ రాక కెదురు చూచుచున్నాను.

రాధా: (ఆశ్చర్యముతో) ఆఁ - వర్తకుఁ డిచ్చినాఁడా! హా! రంగా! పాండురంగా!! నీ వవధూతవు. నిష్కళంకుడవు. నీ కే పంకిల మంటును? పరాత్పరుఁడవు. నే నపరాధినిని. వ్యర్థురాలను. నా తప్పు క్షమింపుము. నన్ను మన్నింపుము. అబ్బా! నిన్నెన్ని నిష్ఠురోక్తు లాడితిని? ఎట్లు సహించితివయ్యా! దేవా!! నా నాలుక వ్రయ్యలుగాను!

ఉ. తప్పు క్షమింపుమన్న, విదితంబుగ నీ భజనామృతంబె, త
న్నెప్పుడుఁ బ్రోచునంచు మది నెన్నుచునుండు మదీయ భర్తకున్
ముప్పు ఘటిల్లునంచు నతి మూర్ఖత నిన్నటు తూలనాడితిన్
ఎప్పగిదిన్ గృపంగనెదో! యీశ్వర! యీ కలుషంబు ద్రుళ్ళగన్.

దైవమా! దాసుల తప్పు దండముతో సరియంద్రుగదా! నా తప్పు క్షమింపుము. నన్ను మన్నింపుము. నా యజ్ఞానము నేఁటితో నశించినది. జగద్రక్షకా! ఆపద్బంధూ!! నీవు తప్ప మఱెవ్వరు శరణ్యులు? అమ్మా! జనాబాయి! నీవు ధన్యురాలవు. పరాత్పరునిఁ బాండురంగనిఁ గంటివి.

జనా: అమ్మా! ఆ వర్తకుఁడు పాండురంగస్వామియా?

రాధా: ఔను, అతని నిజాకారమును గాంచలేకున్నను నాతని ప్రచ్ఛన్న వేషము నైనను గంటివి. నీవే ధన్యవు. అచిరకాలంబునన స్వామి నీకు సాక్షాత్కరించును. నీ జన్మము ఫలించును.

జనా: భగవత్కృప.

రాధా: మంచిది. ఇఁక మనము లోని కేగి పచనము చేతము, రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు)

(యవనిక వ్రాలును)

ద్వితీయాంకము సంపూర్ణము.

---

# భక్త జనాబాయి

## తృతీయాంకము

### ప్రథమ రంగకము

[నామదేవుని గృహము]

జనా : (౬ వ అనుబంధము) (పిండి విసరుచుండగాఁ తలుపు చప్పుడగును) ఎవరువారు ? (లేచివెళ్ళి తలుపుదీయును.)

(శ్రీకృష్ణుఁడు జనాబాయికి స్త్రీవలెఁ గనఁబడును)

కృష్ణా : (ప్రవేశించును) నీవేనమ్మా యిప్పుడు పాటపాడినది ?

జనా : ఔను. రండు కూర్చోనుఁడు.

కృష్ణా : (పీటపై గూర్చుండును.)

జనా : అమ్మా ! తమ పేరేమి ? తమరేల వచ్చితిరి ?

కష్ణా : (అటునిటుచూచి) అమ్మా ! నాపేరు కృష్ణాబాయి. శ్రీకృష్ణనిపై నీవు పాటలు పాడుచుండ వినవచ్చితిని. మా యత్తమామలకు శ్రీహరియన్న గిట్టదు. గాదె క్రింద యెలుక లెల్లప్పుడు కలుఁగులోనికి గింజలు గూర్చునట్లు సర్వదా పరుల మోసగించి ధనమార్జించుటే వారి వృత్తి. అదే చింత. ఇఁక నా మగఁడన్న వారి పుత్రుఁడేకదా ? ఆవు చేనిలో, దూడ గట్టున మేయుట కలదా ?

జనా : అటులనెదరేమి ?

తే. గీ. ముండ్ల మధ్యమున గులాబి పూలు మొలచు
ఊలగనులను రత్నాలు ప్రభవమొందు
ఫణిఫణంబుల మణులును బరఁగునటుల
ఖలులకడుపున సుజనులు గల్గుచుంద్రు.

త్రిజగత్కంటకుఁడైన హిరణ్యాకశిపుని గర్భమున శ్రీహరి భక్తుఁడగు ప్రహ్లాదుఁ డుదయించు టెఱుఁగవా ? తల్లీ – దానికి మనమేమి చేయుదుము ? అయినను విలపించిన విపత్తు లీడేరునా ?

కృష్ణా : రామ ! రామ !! ఇంతపాప మెచ్చటనైన గలదా ? హరి దాసుల కన్నమిడుటతప్పు. హరికథ లాలించుటతప్పు. మీబోంటి పావనుల దివ్యకథా సందర్శన మొనర్చుట తప్పని నామగఁడు నన్ను రట్టుపెట్టుచుండును. నీ కీర్తన మాలించి పరవశనై యిటకు వచ్చితిని. ఏది, మఱియొకసారి హరికీర్తన పాడుము. శ్రవణానంద ముగ వినుచు నేన యీ పిండి విసరెదను.

జనా : (౭ వ అనుబంధము)

కృష్ణా : అమ్మా ! పిండియైనది. లోనికేగి పళ్ళెరమును దెమ్ము. దీని నెత్తి యిచ్చెదను. (తిరుగలి తీసి పిండి కుప్పగా నద్దుచుండును.)

జనా : చిత్తము. (నిష్క్రమించును)

కృష్ణా : ఆహా ! ఏమీ తరుణి భక్తిపారవశ్యము. ఏమీ వనిత సత్త్వవర్తనము.

సీ. ఆబాల్యమాదిగ హరినామ సంకీర్త
నామృతంబును గ్రోలు నాతిమిన్న
మోక్షమార్గ నిరోధముల వీడి జగతి ని
ష్కామంబుతో నున్న కలికిమిన్న
పరులకుఁ దనకు దైవంబునకు నభేద
భావంబు గలిగిన పడఁతి మిన్న
కుసుమకోమలియయ్యుఁ గోవిద సేవ క
లరుచునుండెడు నవలాలమిన్న

తే. గీ. భక్తి హృత్పద్మమున నను బంధితునిగఁ
జేసి భావనామృతమును బోసి, పెంచి
తనకు వశ్యునిగాఁ గొన్న తరుణి మిన్న
భక్తులం దెన్న నీ జనాబాయి మిన్న.

(అదృశ్యుఁడగును)

జనా : (పళ్ళెరముతో వచ్చి) ఏదీ కృష్ణాబాయి యెక్కడ ! కృష్ణా బాయి ! కృష్ణాబాయి !! (నలుదిక్కులు వీక్షించి, పిష్టరాశిపై శంఖ చక్ర చిహ్నితములగు శ్రీకృష్ణుని పాణ్యంకములఁజూచి

నిర్భరానందముతో) కృష్ణా! కృష్ణా!! (కన్నుల కద్దుకొని) భక్తవత్సలా! నీ వెంత కరుణార్ద్ర హృదయుఁడవు. ఒక్కసారి నినుఁ గీర్తించినంత వచ్చితివి. నీపతి రుక్మిణీబాయి నీకై యెందరిగెనో! పెద్దతడవు నాకడ వసించితివి. పరపురుషునితోడి ప్రియభాషణము కులస్త్రీలకుఁ దగదనియా? నా మనంబెఱిఁగిన నీకు, నే నితరముగాఁ దోఁచితినా? కృష్ణా! స్వస్వరూపమున నరుదెంచినను నిను గాదను వా రెవరు? (ఆలోచించి) ఉ! కాదు కాదు, నీసతి రుక్మిణి నిన్నడ్డును, నీ ప్రియభార్య సత్య గద్దరించును. నీ ప్రియురాలు రాధ యెట్టుపెట్టును. ఊ! వట్టి మాట. గజప్రాణావనోత్సాహివై యరుగునపుడు, శ్రీజయ దేవులకు సాక్షాత్కరించినపుడు, ప్రహ్లాదునకై యుక్కుకంబము నుండి యుద్భవించినప్పుడు నిన్ని రుక్మిణియు, సత్యయు, రాధయు, బోవలదని యరికట్టిరా? భక్తావనా! నన్నేల యుద్ధరింపవు? నాకేల దర్శనమీయవు? కృష్ణా! నీదయఁజూరగొనుట కే నింకను నోచుకొనలేదా? నాగతియేమి, నాకింకెవరు దిక్కు? కృష్ణా! క్రూరురాలనై పిండియంతయు నీచేత విసరించితిని, నేనెంత యవివేకిని, నిన్నేల గుర్తింపను? నామౌఢ్యమునకు మన్నింపుము. నన్ను నీయందుఁ జేర్చికొనుము. తండ్రీ!

(౮ వ అనుబంధము)

నామ: (ప్రవేశించి) తల్లీ! జనా! ఏలయిట్లు విషాదముద్ర వహించి యున్నావు. కారణమరయుదునా?

జనా: తండ్రీ, నాగోపాలకృష్ణున కింకను నాపైఁ గృపగలుగదే? పిండి విసరుచున్న నాకడకు స్త్రీవలెఁ గపటవేషధారియై చనుదెంచి తాను తిరుగలి విసరుచు నా కీర్తన లాలించి నేను గృహము లోనికి బళ్ళెరమునకేగి వచ్చునంత నదృశ్యుఁడయ్యె. ఆ మాయ వేషధారి మన్మానససరసీరుహాసనుఁడు, ఇవిగో! ఇవిగో!! శంఖ

చక్రాంచిత పాణ్యాంకములీ పిష్టరాశిపైఁ గన్పట్టుచున్నవి. తండ్రీ ఇఁక నాకుదిక్కెవరు? ఇక నాకేది తెఱవు? నాకు శ్రీహరిదర్శన భాగ్యము లభింపదా? (విచారముతో నుండును.)

నామ: (దయాశాంతవచనముల) భగవల్లీల లెఱుఁగ నేరికి శక్యము? తల్లీ!

మ. తొలిజన్మంబునఁ జేసినట్టికృషి యెంతో యంతకుఁ సాటిగా
ఫల మీజన్మమున న్ఘటిల్లు నది తప్పంజూడశక్యంబె? లో
కులు కష్టంబుల దూరుచుంద్రు విధినిఁ గోపంబునన్ మూఢులై
లలనా! మూర్ఖులఁబోలి చింతిలక, శ్రీ లక్ష్మీపతిం గొల్వుమీ.

కర్మవిమోచన మగువఱకుఁ దాళియుండుము. ప్రశాంతముతో హరిని ధ్యానింపుము. త్వరలో సర్వాంతర్యామి స్వస్వరూప సందర్శనానందకందళిత హృదయారవింద వయ్యెదుగాక, రమ్ము (ఇరువురు నిష్క్రమింతురు).

(యవనిక వ్రాలును.)

ద్వితీయ రంగకము

*[నామదేవుని గృహము]*

జనా: (ఇంటిముంగిటఁ గూర్చుండి శ్రీకృష్ణనిపైఁ గవన మల్లుచుండును)

శ్రీకృ: (తాటాకులు, గంటమును జేతఁబూని వ్రాసికొనుచుండును.)

జనా: కృష్ణా! వాచామగోచరుఁడ వగు నిన్నేమని వర్ణింతు!

తే. గీ. భువనజాతములను జఱు బొజ్జనుంచి
జీవకోటులకు న్నీవ జీవనమయి
స్వస్వకర్మానుఫలముల జరుపుచుందు
వీవ, నిన్నెఱుఁగంగ నే నెంత? కృష్ణ!

కృష్ణు: (వ్రాసికొని) ఆహా! ఈ కలకంఠి వాక్సుధారసము గంగాజల ప్రవాహగతింబఱగుచు భక్తితరంగముల నన్నూఁగ జేయుచున్నది. ఈ కవయిత్రి నాపై నల్లు కవన మెంత కొనియాడఁదగినది! ఐహిక

సుఖావేశవీడి నను(గోరి తల(క్రిందుగ( దపంబొనర్చు మౌనీశుల
కును దెలియశక్యముకాని నే నీమెకు సేవకు(డనై తిని.

తే. గీ. స్వాదుపేశలామృత రసా స్వాదమున(, గ
మలమున వసించు మధుపంబువలె( దన కవి
తారసంబున కాసించి తరుణి హృదయ
పంకజంబునకే వశంవదు(డనై తి.

జనా : శా. పారంబున్ గనరాని వ్యర్థపు భవవ్యాపార పారీణతన్
నేర(జాలను, తావకాంఘ్రి యుగళిన్ నిశ్చింత సేవింప, నీ
కారుణ్యామృత దృష్టి నన్ను(గని, మత్తాలుష్యముల్ బాప నా
ధారంబీవ మఱొండు లేరుగద, భక్తవ్రాజ చింతామణీ!

శ్రీకృ : (వ్రాసికొనును)

జనా : చం. సనకసనందనాది ఋషి సత్తము లెన్న(దరంబుకాని, పా
వనచరితుండవీవ, భవపంకనిమగ్నను గాదె నేను, నిన్
మననము సేయనోపుదునె ? మాధవ !, దీనజనావనుండ వీ
వ, నను( గృపందలంచి పరిపాలన సేయవె నీకు మ్రొక్కెదన్.

శ్రీకృ : (వ్రాసికొనును) అహా ! ఏమీ కవనము !!

తే. గీ. సకల కుసుమరసంబుల చవినెఱింగి
భ్రమరి కూర్చిన పుష్పాసవమునకన్న
స్వాదుపేశల గుణము లీ సరణి(గూర్చి
సుకవితామృతలహరి నీ సుదతి పార్చు.

నామ : (ప్రవేశించును) (9 వ అనుబంధము)

శ్రీకృష్ణ : (ఉలికిపడి తాళపత్రములను గంటమును దాచికొని పోవ
నుంకించును.)

నామ : శ్రీకృష్ణభగవాను( డేమో చిత్రమొనర్చి నా కనుగట్టు యత్నించు
చున్నా(డు. కానిచో నీ తొ్ట్రుపా టేల కలుగును ? కృష్ణా !
కృష్ణా !!

శ్రీకృష్ణ : (విననియ ట్లభినయించును.)

నామ : (ఉచ్చైస్స్వనముతో) కృష్ణా! శ్రీకృష్ణా!!

శ్రీకృ : (వెనుదిరిగిచూచి) ఓహో! నామదేవులా!

నామ : స్వామివా లేదో నాటకమాడించుచు నాకుఁ జూపకున్నారు. ఇదియేనా? ఉపాస్యోపాసక మర్యాద.

శ్రీకృ : ఏమియులేదు. నామదేవా! మఱేమియులేదు.

నామ : ఔను. ఏదియు లేకుండుటనే వలలోఁ జిక్కిన చేఁపవలె నా దృక్పథమునుండి తప్పించుకొనఁ జూచుచున్నావు. మాయా నాటక సూత్రధారుఁడవు. నీవెన్ని నాటకములనైన నాడింపఁ గలవు. ఇదివఱ కెన్ని యాడించితివో! ఇక ముందెన్ని యాడింప గలవో! సంకల్పసిద్ధుఁడవు. నీవు తలంచినఁ గాకుండున దెద్ది!

శ్రీకృ : నామదేవా! నన్నుగూర్చి యీ వ్యాఖ్యానమేల? నీ వెఱుఁగని దిచ్చట నేమియుండును?

నామ : (మందహాసమున) మఱేముండును? ఉగ్గుపాలతో నలవడిన చౌర్యము నే డీవు లక్ష్మీకాంతుఁడ వైనను బోవునా? భక్త మానసాపహారీ! ఎవని గ్రంథమునుండి యీ తాళపత్రములను దొంగిలించితివి? పాప మా గంటమును వానిదేనా?

శ్రీకృ : (పరిహాసముగా) ఆహా! ఎంత చక్కఁగా గ్రహించితివి. నేను కవినైనను బద్యచౌర్యమునకుఁ బాల్పడు కాకవి ననుకొంటివా?

నామ : (తన కీయ సైగ చేయును)

శ్రీకృ : (పరధ్యానము నటించుచుండును.)

నామ : (చదివి కన్నుల కద్దుకొని) కృష్ణా!

ఉ. ఏ మహనీయధన్య రచియించెనొ నీ పయి నిట్లు పద్యముల్
ఏ మహితాత్మపూత రచి యింపగఁ జేసెనొ నిన్నుఁ బద్యముల్
ఏమి తపంబుచేసి కనె నిట్టి కవిత్వ మహత్వసంపదన్
ఆ మహితాత్మఁగాంచ హృదయంబునఁ గోరికలుబ్బి పర్వెడున్.

శ్రీకృ : (తట్టి) నామదేవా? అదుగో! జనాబాయి. ఆబిడ వక్త్రపద్మమే యీ కవితా మాధురీఝురికి జననస్థానము. భక్తి పార

వశ్యమున వివశయై మల్లీలాభివర్ణన మొనర్చుచున్నది. మన మిచ్చట నొకింత పొంచియుండి యామెను గమనింతము రమ్ము.

నామ : (శ్రీకృష్ణుని వెన్నంటును. ఇరువురు నిష్క్రమింతురు)

జనా : గోపాలకృష్ణా! భగవత్సందర్శన భాగ్యము నా కీ జన్మమున లభింపదా ? నే నింకను బావనిని గాలేదా ? త్రికరణశుద్ధి నిను గొల్చు దాసిపై నీ కింత కృపగల్గదా ? నా జన్మము, నా భక్తి, నా శ్రద్ధ, నా ప్రేమ నేఁటితో వమ్ము గావలసినదేనా ? సర్వకాల సర్వావస్థల నిన్నేమఱక భజించు నీ దీనురాలి గోడెఱుఁగని వాఁడవా ? నాఁడల్లుఁడా రమ్మని గోముఖవ్యాఘ్రమువలెఁ బిలిచిన మామ నెట్లు మెచ్చితివో! కాళింది, పూతన, శకటాసుర, ధేనుకాసురాది రాక్షసులకన్న నిను నే నెక్కుడు గారించితినా ? భక్తత్రాణ పరాయణుఁడవను నీ బిరుదున కీనాడు భంగపాటు కలిగెనా ? నన్నుఁ గృపఁగనవేమి కర్మము ? కృష్ణా ! నీవరుదెంచిన నాకడ వెన్నముద్దలు లేవనియా ? దధిభాండములు దొరకవనియా ? బొజ్జనింప క్షీరముండదనియా ? పరుండఁ బాపాన్పు లేదనియా ? నా హృత్పంకజమునఁ బరుండినను నీ కిందిరా సంగమము లభించునే. నిష్కళంకమై నిశ్చలమనంబునఁ బ్రార్థింపుచున్న నాకు దర్శన మీయని నీవు -

తే. గీ. కన్న తల్లికి నెడఁబాపి కానఁద్రోసి
పూతనాది రాక్షసుల నీ పొడవణంప
లేక, మధురకుఁ బిలిపింప లేశమైన
సంశయింపక చనితె ? కంసారి ! చెపుమ !

కృష్ణా ! కృష్ణా ! కృష్ణా !! గోపాలకృష్ణా ! బాలకృష్ణా !! (అని మూర్ఛనొందుచుండ శ్రీకృష్ణుఁ డామెను బట్టుకొని యంకతలమున బరుండఁజేసి 10 వ అనుబంధమును బాడును)

శ్రీకృ : నామదేవా ! నీ వీమె పూర్వజన్మవృత్తాంత మెఱుఁగుదువా ?

నామ : స్వామీ ! వినఁగోరెదను.

శ్రీకృ : అవధరింపుము.

తే. గీ. ఉద్ధవుఁడ వీవు, కుబ్జ యీ యువిద, పూర్వ
జన్మమందు నన్ను వరించి శయ్యఁ జేర్ప
మత్కర స్పర్శనము సేసి మహితగుణము
గలిగి వరమొందె నా చేతఁ గడకుఁ దాను
దన పునర్జన్మమున ముక్తి గనఁగ భక్తి.

(శ్రీకృష్ణుఁ డదృశ్యుఁడగును. తెర బ్రద్దలగును. బాలకృష్ణుఁడు, కుబ్జ, ఉద్ధవుఁడు కనఁబడుదురు.)

నామ : ధన్యోస్మి! ధన్యోస్మి!!

తే. గీ. బ్రతుకు బంగారమయ్యె, నా వ్రతము పండెఁ
బూర్వజన్మమునందు నా పొత్తులేక
సానియింటికిం జననట్టి సంగడీఁడు
బాలకృష్ణు సందర్శన ప్రాప్తిఁ జేసి.

ఆహా! ఆ కుబ్జయే యీ జనాబాయి. ఏమీతన్వి యదృష్టము! మఱుగుజ్జయి యుండియు మంగళాకారుని మన మాకర్షించినది. యథార్థ మంతియె.

తే. గీ. వనిత నిష్కల్మషంబైన వలపుచేతఁ
బూరుషుని వశ్యుఁగాఁగొని పొందుసుఖము
మెఱుఁగుపూఁతల, సొమ్ముల మఱుఁగుమందు
ల, నన్నృతంపుపల్కుల, టక్కు లను, టమారి
విద్దియలఁ బొందనేర్చునె రద్దిగాక ?

శ్రీకృ : (ప్రవేశించి) నామదేవా! ఇంకను జరుగనున్న విచిత్రమును గందము. రమ్మ. (నామదేవునితో నిష్క్రమించును)

జనా : (మూర్ఛనుండి లేచి) కృష్ణా! కృష్ణా!! గోపాలకృష్ణా! మురళీ కృష్ణా! ముద్దుకృష్ణా! పోకుము. పోకుము.

(౧౧ వ అనుబంధము)

రాధా : (ప్రవేశించి) జనాబాయీ ! నీవేల యిట్లు కలవరపడుచున్నావు?

జనా : (ఆత్రముతో) తల్లీ ! కృష్ణుఁడు, బాలకృష్ణుఁడు, నా ముద్దు కృష్ణుని, నా గోపాలబాలుని, నా మురళీకృష్ణుని నాకుఁజూపరా? (విషాదమున) ఏడీ ? ఎచ్చట ? ఎచ్చట ? చూపవా ?

రాధా : అయ్యో ! వెఱ్ఱితల్లి ! శ్రీకృష్ణుఁ డిందు రాలేదు. వచ్చిన నగ పడఁడా ? ఏల యిట్లు పిచ్చిదానివలెఁ దిరుగుచుంటివి ? మనస్సు కుదురుపఱచుకొనుము. శ్రీకృష్ణుఁడిందువచ్చినఁగదా చూపుట !

జనా : వచ్చినఁగదా ! అదేమి ? వచ్చెనుగదా ! రానేలేదా ? లేదులేదు. నా బాలకృష్ణు నెందో దాచివచ్చి లేదనుచుంటివి. రమ్ము నా కృష్ణుని నాకుఁజూపుము. (రాధాబాయిని లాగుచుండును)

నామ : (ప్రవేశించును).

జనా : తండ్రీ ! మా యమ్మ నా బాలకృష్ణునెందో దాచివచ్చి చూపు మన్నఁ జూపకున్నది. మీరైన నా దేవదేవుని నా మురళీకృష్ణుని నాకుఁ జూపరా ? (కాళ్ళపైఁబడి ప్రార్థించును).

నామ : (లేవఁదీసి) అబలా ! సర్వాంతర్యామి, సకలభూతాత్ముఁడు, సర్వేశ్వరుఁడగు శ్రీకృష్ణు నెందు చూపఁగలను ? అతఁడు లేని స్థల మొక్కటి గలదా ? శ్రీకృష్ణ పరబ్రహ్మ మద్వితీయమై పర్వత ములనుండి పరమాణువు వఱకును, సూర్యచంద్రాది గోళములు సమస్తము దానయై, పరంజ్యోతియై వెలుఁగుచున్నాడు.

జనా : మహాత్మా ! నే నజ్ఞానను, అబలను. భక్తజనలోలుఁడు, భక్తి పాశబద్ధుఁడు. భక్తవ్యామోహనుఁడు, నా గోపాలకృష్ణుఁడు నాకు జక్షుర్గోచరుఁడు కాఁడా ? (నిట్టూర్పువిడిచి) కృష్ణా ! కృష్ణా !! (రాధాబాయితో) అమ్మా ! కృష్ణుఁడు నా బాల కృష్ణుఁడు ! (ఆలించి విని) నిజముగా నిదియే మురళీగానము. అహో ! గోపాలబాలుఁడు ! గజ్జెలందియలు మ్రోగుచున్నవి. (౧౧ వ అనుబంధముతో నిష్క్రమించును)

రాధా : } ( పరస్పర ముఖావలోకనములతో నామె వెళ్ళిన త్రోవను
నామ : } వెళ్ళుదురు. )

( యవనిక వ్రాలును )

తృతీయ రంగకము

( నిష్కుటవనము )

జనా : (౧౧ వ అనుబంధముతోఁ బ్రవేశించును) ( ఒక గున్న మావిని సమీపించి విభ్రమముతో ) ఏఁడీ! శ్రీ కృష్ణ భగవానుఁడు! (పరికించి) మోసపోతిని. ఓసీ! తుమ్మెదా!

తే. గీ. కృష్ణవర్ణంబుదాల్చి శ్రీకృష్ణునందు
ఐక్యమును నొంద నెంచితో యది హుళక్కి
కాని మధువానునపుడును గానలోలు
కీర్తనము మాన వెంత సుకృతవు భ్రమరి!

(౧౧ వ అనుబంధముతో నొక వెదురుగుమ్మును సమీపించి) ఏఁడీ! శ్రీకృష్ణభగవానుఁడు! (యోచించి) అబ్బా! ఎన్ని విఘ్నములు సమీర! పదిక్కునులేని నీకింత యార్భాటమేల? ఎంత కాలహరణ మొనర్చితివి!

తే. గీ. వెదురుసందుల జివ్వున వీచుకతన
మురళియో యను భ్రమమున మురిసియాడి
కాదనుచు నెఱిఁగిన యంతఁ గనలి ఫణులు
మ్రింగుటుచితంబె నిన్ను సమీర కపటి!

(౧౧ వ అనుబంధముతో నిష్క్రమించును.)

నామ : } (ప్రవేశింతురు)
శ్రీకృ : }

శ్రీకృ : నామదేవా! చూచితివా? ఇది భక్తి; ఈమె భక్తురాలు. ఈ జనాబాయియే పరమభక్తురాలు.

నామ : భక్తవత్సలా! ఇఁకనైన నాబాలను గృపఁగనవా?

కృష్ణ : (రోయుచు) ఇదుగో! ఇటే వచ్చుచున్నది.

నామ : కృష్ణా ! ఏ పట్లు రోయుచున్నావు ?

కృష్ణ : చూడు మా యింతి యెటుల పరుగిడుచున్నదో !

నామ : ఆహో ! భక్తుల కార్తిగలిగిన భగవానుఁ డోర్చునా ? కాయ ద్రెంపినఁ దీఁగె యల్లలాడదా ?

జనా : (౧౧ వ అనుబంధముతోఁ బ్రవేశించును.)

రాధా : (ప్రవేశించును.)

జనా : గురువర్యా ! నా చిన్నారి కృష్ణునిఁ జూపరా ?

జనా : ( శ్రీకృష్ణు నాపాదమస్తకము వీక్షించి ) ఈ కృష్ణుఁ డెవరు. మాయవేషధారి, కృష్ణపాత్రధారి. నా కృష్ణుఁడు బాలకృష్ణుఁడు? హా ! కృష్ణా ! కృష్ణా ! !

తే. గీ. పాలబుగ్గలలేనవ్వు జాలువాఱఁ
దప్పటడుగుల గజ్జియల్ తాళగతిని
మ్రోయ, పింఛంబు నసియాడ మురళినూదు
లీల దర్శనమిమ్ము, గోపాలకృష్ణ !

శ్రీకృ : అట్లయగుఁగాక ! (అదృశ్యుఁడగును)

(పైవిధమున బాలకృష్ణుఁడు ప్రత్యక్షమగును.)

(జనాబాయి, రాధాబాయి, నామదేవులు స్తుతింతురు) (౧౨ వ అనుబంధము.) (బాలకృష్ణుఁ డదృశ్యుఁడయినంత శ్రీకృష్ణుఁడు ప్రత్యక్షమగును.)

నామ : కృష్ణా ! నీ లీల లెఱుఁగ నేరికి శక్యము ? భక్తప్రియా ! భక్తుల కొఱకే నీవిన్ని యవతారము లెత్తుట. కాని, నాదొక కోర్కె గలదు. నేఁడీవు మా కతిథివిగా రమ్ము.

శ్రీకృ : (మాటలాడకుండును.)

నామ : ఏమి నిరుత్తర మనంగీకార సూచ 

శ్రీకృ : ఉఁ; ఉఁ ! (అని ముఖము త్రిప్పును.)

నామ : శ్రీకృష్ణా ! అలనాఁ డా కుచేలుఁడే ధన్యుఁడు. విదురుఁడే ధన్యుఁడు.

శ్రీకృ : నామదేవా! మీ యతిథి తొడపై, మీ జనాబాయి కూర్చుండి భోజనము తినిపింపవలెను.

నామ : అమ్మా : ఏమి నీ యదృష్టము ! స్వామివారి యభీష్టము నెఱిఁగితివా !

జనా : ధన్యోస్మి ! ధన్యోస్మి ! !

తే. గీ. పదరజస్స్పర్శమాత్రఁ బావనము సేయు
వానియూరుతలంబు నే చాన యొల్ల
కుండు ? రససిద్ధిచే నిన్ప గుండు పసిడి
ముద్దయగుటకు సందియం బుండునొక్కొ ?

రాధా : ఆహా !

సీ. భూతకోటులనెల్ల పోషించు పురుషోత్త
మున కన్నమిడు సతి పుణ్యమేమొ !

నామ : క్షీరాబ్ధికన్యక చెలువొందు శ్రీహరి
యంకపీఠిక నెక్కు నతివ ధన్య

జనా : యజ్ఞాదికర్మల కందగారాని, శు
భస్థలినుంట నా భాగ్యముగద

నామ : ఎవ్వరెఱుఁగనట్టి యిట్టిపదవి జనా
బాయి కనుట కామె భాగ్యమేమొ !

కృష్ణ : తే. గీ. భక్తప్రహ్లాద, విదుర, శబరి, కుచేలు
రాదిగాఁగల భక్తులం దరయ మిన్న
యగుటఁ దృప్తితీర భుజింతు నమితకాంతు
చే జనాబాయి తినిపించు భోజనంబు.

నామ : కృష్ణా! తరించితిమి. గృహమున కేగుదము రమ్ము.

( ఎల్లరు నిష్క్రమింతురు )

(యవనిక వ్రాలును.)

తృతీయాంకము సమాప్తము )

---

# భక్త జనాబాయి

## చతుర్థాంకము

---

ప్రథమ రంగకము

(నామదేవుని గృహమున శ్రీకృష్ణుఁడు, జనాబాయి చెరియొకప్రక్కపైఁ బరుండి నిద్రించుచుందురు. తెర వెలువడును)

శ్రీకృ : (నిద్రనుండి లేచి కూర్చుండి) ఆహా! అవస్థాత్రయంబునను నన్నే మరక భజించు నియ్యింతి ప్రాపున నే నెంతయు ధన్యుఁడను. నా కెనలేని మోదము గలుగుచున్నది. రాధాబాయి యొసఁగిన నా ప్రసాదము నీమె స్వీకరింపమఱచి నిద్రించుచున్నది. దానంజేసి నా కెంతయు క్షుద్బాధ యతిశయించుచున్నది. త్వరగా నీమెను లేపి భుజింపఁజేతును. (జనాబాయి నుద్దేశించి) జనాబాయి! జనాబాయి!!

జనా : కృష్ణా! కృష్ణా!! (అని లేచి కూర్చుండును)

శ్రీకృ : జనా! నా కాఁకలి మితిమీరుచున్నది. తాళఁజాలకున్నాను, నాకేమైన నొసంగుము.

జనా : స్వామీ! నా కడ నేమియున్నది. నీకున్నివారణమున కే నేమి యొసఁగుదును? నా హృదయము నారగించి నీ యాఁకలిఁ దీర్చికొనుము.

శ్రీకృ : (జనాంతికముగా) ఆహా!

తే. గీ. అచ్యుతము నద్వితీయమునై చెలంగు
తనదు నాత్మార్పణంబున ననుఁ గృతార్థుఁ
జేయఁగాఁగోరి త్రికరణ సిద్ధితోడఁ
బలుకు నీబాల యమృతంబు లొలుకు పలుకు.

(జనాబాయిం జూచి) అటు లనెద వేమి? నీకు రాధాబాయి యొసఁగిన యుచ్ఛిష్టాన్నము నేమిచేసితివి?

జనా : (సంభ్రమమున) ఔనౌను మఱచితిని కృష్ణా! క్షమింపుము నన్ను మన్నింపుము. (తలక్రిందనున్న రొట్టెముక్కలను దీయును

శ్రీకృష్ణుఁ డామె ప్రక్కమీఁదఁ గూర్చుండును. ఇరువురు భుజించు చుందురు. ఈలోపల శ్రీకృష్ణుఁడు తన యాభరణములన్నిఁటిని నామె ప్రక్కలో దాచును ).

శ్రీకృ : చాల ప్రొద్దుపోయినది. నీవు పరుండుము.

జనా : చిత్తము. (పరుండును)

శ్రీకృ : (౧౩ వ అనుబంధము) (నిష్క్రమించును)

(యవనిక వ్రాలును.)

ద్వితీయ రంగకము

( విఠోబాగృహము )

విఠో : (శయ్యపై నిద్రించుచుండి కలవరపాటున లేచి) హా ! రంగా ! రంగా ! అమ్మా ! జనా ! జనా ! (శయ్యపై వ్రాలి నిద్రించు చుండును).

వీరప్ప : (ప్రవేశించి) అయ్యా ! అయ్యా !

విఠో : (లేచి కూర్చుండి) ఎవరు ? ఎవరు వారు ?

వీరప్ప : దాసుఁడను స్వామీ ! తమరేదో కలవరించుచున్నట్లున్నారు.

విఠో : అడుగో ! రంగఁడు. ఇదుగో నా కన్నతల్లి జనాబాయి. అమ్మా ! జనా ! జనా !

వీరప్ప : స్వామీ ! ఇది తమ స్వగృహము. పండరి కాదు, కోవెల లేదు. ఇవి చిత్రఫలకములు.

విఠో : (కన్నులు మూసికొని) హా ! హాతాశ ! వీరప్పా ! సత్రమున కేగుద మెవరైనను మహాత్ములు, తైర్థికులు ఎందైన నా బిడ్డను గనియుందురేమో !

వీరప్ప : దేవర ! తెల్లవాఱుచున్నది. వెళ్ళుదము రండు.

విఠో : (లేచి)

శా. శ్రీకాకుత్స్థకులాబ్ధి శీతకరు, రాజీవాక్షు, ధర్మాత్ము, సీ
తాకాంతుఁ, భవబంధభంజను, గుణోద్ధాముఁ, మహావీరు, ని

త్త్యైకానంద రసాత్ము, దాశరథి, భక్తాభీష్టసంధాయకుఁ
లోకారాధ్యు,రఘుప్రవర్యుఁదమి, నీలోఁగొల్వుమా? చిత్తమా!
(ఇరువురు నిష్క్రమింతురు. యవనిక వ్రాలును)

## తృతీయ రంగకము

( *పండరిపుర వీథి* )

( పశేలు, అర్చకుఁడు, పౌరులు, భటులు ప్రవేశింతురు )

పశేలు : (అర్చకుని జూచి) ఇంకెవరియిల్లు చూడవలయును ?

అర్చ : ఎవరిల్లేమిటి ? స్వామివారి సొమ్మంతా దొంగిలించిన యాదొంగ ముండాకొడుకిల్లు.

పశేలు : ఎవరా చోరుఁడు ?

అర్చ : చోరుఁడెవరా ? ఎవరేలా యౌతారు. చౌర్యము చేసినవాఁడు చోరుఁడు.

పశేలు : ఎవరా చౌర్యము చేసినది ?

అర్చ : అది మేము చెప్పుతే యింకా మీరు మీ యేగులోళ్లంతా యెందుకు ? తగులఁబడనా ? నే నసలు చూస్తే వాండ్లను బోనిస్తానా ? తస్సకొయ్య ! రాజభటుల కప్పగించి సున్నములోని కెముక లేకుండ పొడిపించకపొయ్యానా !

౧ పౌ : కోవెలలోని కెవరును వచ్చినట్లుతోఁచదు, ఏలయన ? కుంచెకోల తమయొద్దనే యున్నది. తలుపులా ? తెఱచినట్లులేవు. కావున స్వామివా రెచ్చటికో వేంచేసి యుండవలెను. ఏభక్తునికోదయతో ననుగ్రహించి యుండవలెను. నాకైతే యిలా తోఁచుచున్నది.

౨.వ : అప్పాజీ ! నీ మాట చక్కఁగా నున్నది.

పశేలు : అట్టి భక్తులెవరు ?

అర్చ : ఎవరున్నారు ? అతఁడు లేఁడు నామదేవులె.

౩ పౌ : కాదు. వాని యింటిలోనున్న పిల్ల. నామదేవుఁడు భక్తుఁడు కాని దొంగకాఁడు. ఆయన నంతా యెఱుఁగుదురు.

౪ పౌ : ఔను. ఆ పిల్ల యెప్పుడు స్వామివారిని విడిచియుండునదికాదు. నాకుఁ గూడ నా పిల్లయందె—కొంచె మనుమానము.

౫ పౌ : కొంచెములేదు, గించెములేదు. అపహరించినదా పిల్లయె. నాకు గట్టి నమ్మకము. స్వామివారిని చూచింది. అట్టె నగలపైఁ గన్ను కుట్టింది. ఏమాఱు తాళపుచేతులో సంపాదించుకొని వెలుతురు లేకుండ పని చక్కబెట్టుకుంది.

అర్చ : ఔనౌను. ఇచ్చటికి వచ్చేవారంతా తెల్లగడ్డాలవారు, పేలపిండి వారె కాని యీలాఁటి పడుచుపిల్లలు వచ్చి యింత భక్తితో నుండగ నేను చూడలేదు. మా నాన్నైనఁ జెప్పలేదు. మాతాత యైన మచ్చుకెక్కడా వ్రాసిపెట్టలే.

౩ పౌ : వచ్చిన నెందులకు వచ్చెడివారో ! ఎందులకుఁ బోయెడివారో కాని, యిటువంటి పాపమెన్నడుఁ జేయలేదు. రామ ! రామ !! స్వామి వారి నగలే దొంగిలించుట ?

అర్చ : కాకపోతె పిల్లేమిపిల్ల. పదునాఱేండ్లబాలపడుచు, పట్టుచెండు, కరగిపోసిన కడాని. ముట్టుతే మాసిపోతుంది. నిజముగా నిది యిల్లాలయితే బుద్ధిగల కొప్పు భుజము దాటదన్నట్లు పెండ్లి పేరంటము లేక, ముక్కాలు ముసలి తండ్రిని విడిచివచ్చి పడి యుంటుందా ! ఎబ్బెబ్బె !

౪ పౌ : సానిముండలకన్న సంసారి రండలే మిన్న ? అదంతా మీకుఁ జెప్పాలెనా ! యింతకు జనాబాయిని బట్టితిమా సొమ్ములు బయలు పడ్డాయి.

పశేలు : ఆ బాల నామదేవునింట నున్న జనాబాయి యనియేనా మీ నిశ్చితాభిప్రాయము.

అందరు : (ఏకగ్రీవముగా) ఔనౌను.

పశే : సరే. వెళ్ళుదము రండు.

౧ పౌ : (ఆలించి విని) వీరుగో ! నామదేవు లిశే వచ్చుచున్నట్లున్నది.

నామ : (౧౪ వ అనుబంధముతోఁ బ్రవేశించును)

పశేలు : మహానుభావా ! మీయింటనున్న జనాబాయి శ్రీ పాండు
రంగస్వామివారి యాభరణముల నపహరించినదని పంచాయితీ
దారులెల్ల చెప్పుచున్నారు. కావున నేనామెను బట్టి శిక్షించి
యథార్థమును వెల్లడింప నున్నాను.

నామ : ఆమె దొంగిలించినపు డెవరైనఁ జూచియున్నారా? ఎవరువారు?

పశేలు : ఒకరు చూచు టేమి ? ఆమెయే దొంగిలించి యుండనోపు.
కానిచో నా సహకారు లిట్లేల చెప్పుదురు ? ఇదుగో ! నే
నామెను శిక్షించి సొమ్ము వెడల గ్రక్కింతును రమ్ము.

నామ : వెఱ్ఱివాఁడా ! ఆబాల నగల కాశించునా ?

మ. ధనధాన్యంబుల కెల్ల రోసి, జగమే దారిద్ర్యకూపంబటం
చని, శ్రీవిష్ణు పదాబ్జయుగ్మమునె, సర్వైశ్వర్యద ప్రీతిఁ జిం
తనముఁ జేసి సల్పుచు మోక్షలక్ష్మిగను, నీ నారీవతంసంబెటుల్
ధనతృష్ణార్తిని దేవదేపునగలఁ దాచంగఁ దానోపునో.

పశేలు : అయినఁగానిండు; మీరు మాతోరండు. మీయిల్లు సోదాచేసి
చూపెదను.

౧ పౌ : ఉన్నను లేకున్నను సందేహ నివృత్తి యగునుగదా !

నామ : మంచిది రండు. (ఎల్లరు నిష్క్రమింతురు)

(యవనిక వ్రాలును)

## చతుర్థ రంగకము

*( నామదేవుని గృహము )*

(రాధాబాయి పూలను దండగా గ్రుచ్చుచుండును, జనాబాయి
యొక్కొక్క పుష్పము నందిచ్చుచుండును.)

(తెర వెలువడును)

రాధా : జనాబాయి ! పుష్పహారమునందెడనెడ నీ తులసీ దళములను
గూర్చి కట్టిన భగవానున కెంతయో ప్రీతి.

జనా : అచ్చట మహాలక్ష్మి యుండునుగదా !

రాధా : లక్ష్మిని ఉరముననే ధరించియుండును. కనుకనే శ్రీవత్సాంకు డని బిరుదు.

జనా : మహాపతివ్రతయైన తులసియే లక్ష్మీతులసిగా జన్మించిన భగ వానుఁ డనుగ్రహింపఁడా!

రాధా : అమ్మా! యీదండను సమకూర్చుము. చంటివా డేడ్చు చున్నాడు. సముదాయించి వచ్చెదను. (నిష్క్రమించును.)

జనా : తరించితిని (పూలను గ్రుచ్చుచు) కృష్ణా!

మ. సుమనః పుష్పము, హస్తపంకజము, హృత్పూనంబు, నేత్రాబ్జముల్
మిము సేవింపఁగఁ దగ్గపుష్పములు, భూమీజోత్థ పుష్పంబులే
ల? మనోనాయక! భక్తిసూత్రమున, మేల్ రాణించు మద్గాత్రదా
మ మురం బుంచు సిరింబలెన్ సతము నన్ మన్నించి భక్తప్రియా!

[హారమును గైకొని నిష్క్రమించును.]

(పటేలు, పౌరులు, అర్చకుడు, నామదేవులు ప్రవేశింతురు.)

నామ : జనాబాయి!

జనా : (ప్రవేశించును)

పటేలు : అమ్మా! సన్న్యాసినివలెఁ గనఁబడు నిన్నపరాధినిగా భావించు నా విధికి మన్నింపుము.

జనా : హా! పాండురంగా!

రాధా : (ప్రవేశించును)

పటేలు : అమ్మా! స్వామివారి నగలు పోయినవను గగ్గోలు మీ రెఱుఁ గియే యుందురు. అందు మిమ్ము దోషిణిగా గ్రహించితిమి. దీనికి మీ రేమందురు?

జనా : ఆ! ఆ!! నే నేమియు నెఱుఁగను. పాండురంగా! నన్నేల నిందల పాల్జేతువు?

పటేలు : భటులారా! మీ రీ గృహమును శోధింపుఁడు.

భటులు : చిత్తము. (ఇల్లంతయు వెదకి యొక బొంతలోనున్న స్వామి వారి యాభరణములను దెత్తురు. కొందరు కోపోద్దీపితు లగు

దురు. నామదేవుని తలిదండ్రులు, బిడ్డలు నిరుగుపొరుగు వా రెల్లరు విచారముతో వత్తురు).

అర్చ : ఎంతపని చేసితివె. నీ బ్రతుకుగాల, మా నోళ్ళల్లో మన్నుపోద్దా మనుకున్నావా ?

౩ పౌ : ఇది చాల టక్కరి ఎవరి కొంప లార్పటానికో యిలా సన్యాసి నైంది.

పటేలు : (భటులను జూచి) ఈమె చేతులకు గడియవేయుఁడు.

భటులు : (అట్లు చేతురు)

పటేలు : జనాబాయి ! ఆ బొంత నీదేనా ?

జనా : ఔను.

రాధా : (విచారముతో) కట్టా ! ఏ పాపమెఱుఁగని యీ బాలకా ! యీ ఘోర శిక్ష !

పటేలు : జనాబాయి ! నీ వెట్లపహరించితివో నీకుఁ దోడ్పడిన దెవరో సత్వర మెఱిఁగింపుము.

జనా : ఆహా ! నేనేమియు నెఱుఁగను. ఇదియంతయు శ్రీ పాండు రంగని చిద్విలాసము.

పటేలు : పాండురంగని చిద్విలాసమా ? కాక, నీ సౌందర్య విలాసమా? చెప్పుము. త్వరగాఁ జెప్పుము, భటులారా ! మీ రీమెచే సత్య మును జెప్పింపుఁడు.

భటులు : నిజము చెప్పు. ఒప్పుకో. ఒకరి పేరుచెప్పు. (కొరడాలతోఁ గొట్టు చుందురు.)

జనా : (చలింపక) హా ! రంగా ! పాండురంగా ! !

తే. గీ. అన్యమెఱుఁగక సతము నీ యంఘ్రియుగము
దిక్కనుచు నిన్ను సేవించు దీనురాలి
నిట్టి యిడుమల నిందల నేల త్రోసి
పరితపింపఁగఁ జేతువో ! పాండురంగ !

పఠేలు : (ఎగతాళిగా) ఛేష్ (కోపముతో) ఈ టక్కులనుమాని నిక్కము వక్కాణింపుము.

౧ పౌ : ఈమె కెవరైనను రాత్రి తెచ్చియిచ్చిరేమో విచారింపుఁడు.

రాభా : (రోషముతో) ఈమె కెవరుతెచ్చి యిత్తురు ? అట్టితరులిచ్చుటకు నీమె పుచ్చుకొనుట కేమైన నవకాశముండునా ? అసంబద్ధ ప్రలాపములను ప్రేలకుఁడు.

౨ పౌ : ఏమో ! ఆమె చక్కఁదనానికి మీ దారిద్ర్యానికి దయదలఁచి యెవరైన నిచ్చిన నిచ్చియుండవచ్చును.

పఠేలు : సంసారులయం దిట్లు భావింపరాదు.

౩ పౌ : అయ్యో ! ఇందు విపరీతమేమున్నది ?

తే. గీ. ధనమునకొ, తరుణికొ, కాక, తన ప్రయోజ
నం బొకింతయుఁగోరక, న్యాయబుద్ధిఁ
బరుని కుపకృతి సేయఁగ, బరునితోడ
నేస్తమొనరింపఁగోరు చేదస్తుఁడెవఁడు ?

పఠేలు : జనాబాయి ! ఇనుమును గూడిన యింగలమునకు సమ్మెటపెట్లబ్బినట్లు నీ మూలమున నీ పుణ్యదంపతు లిడుమలఁ గుడుచుచున్నారు. సత్వర మొక్కని పేరు చెప్పిన నీకు ముక్తి దొరుకును.

జనా : ధర్మాధికారు లధర్మవర్తనులు గానిచో నిది కలికాల మెట్లగును?

పఠేలు : నామదేవా ! మేమీమెను గొంపోయి తగిన విధిని శిక్షించెదము. మీరేమియు భయపడ వలదు.

నామ : హరిభక్తుఁ డెవరికి భయపడవలెను ? నీకా ? లోకులకా ? లేక సత్యాసత్య విచక్షణలేని నీబోఁటి యుద్యోగాంధకారాయత్త ప్రమత్తచిత్తులకా ? సత్యమునకు వెఱవవలయును. ధర్మమునకు భయపడవలె. కాని, పాపభీతిలేని కలుషాత్ముల కెవఁడు జంకును ?

పఠేలు : (కోపముతో) భటులారా ! యీపూట కీమెను గారాగృహబద్ధను జేసి, సాయంత్రమున వధ్యభూమికిఁ దోడితెండు. (నగలను

నర్చకునకుఁ జూపి) ఈ నగలు స్వామివారి వనుట కెంతయు సందియముండదు గదా ?

అర్చ : సందేహమేమి ? అబ్బె ! స్వామివారివే.

౧ పో : ఔను. ఈలాటిదాని తల గొట్టించితిరో యిఁక మీఁద నీపుణ్య క్షేత్రములఁ గపట సన్న్యాసులు, సన్న్యాసినులు మందునకుఁ గనబడరు.



భటులు : (జనాబాయిని లాగుచుందురు.)

నామ : హా ! పరాత్పరా ! శ్రీకృష్ణ భగవానుఁడా!

చం. సరసిజనేత్రు సేవనమె, శాశ్వత సౌఖ్యపదంబటంచు, నీ
సరణి నమానుషీయమని, జానపదంబులు సన్నుతింప, నే
మఱక, యహర్నిశంబులు, రమాధవు సంస్మరణామృతంబు, సు
స్థిరమతిఁ గ్రోలు నీయబల, శిక్షకు నర్హ యె ! చౌర్యవృత్తయే !

జనా : (రాధాబాయి, నామదేవులు మున్నగు వారలకు నమస్కరించును) సెల వొసంగుఁడు పోయివచ్చెదను.

నామ : అమ్మా ! నీ పవిత్ర జీవితమున కీ యపనిందలే వన్నె తెచ్చు. శ్రీకృష్ణ పరమాత్మ నేమఱక భజింపుడు. నిన్నాతఁడు రక్షింపఁ గలఁడు. ఇవన్నియు నాతని పరిశోధనలే. నీకు శుభంబగును. వెళ్ళిరమ్మా.

రాధా : (జనాబాయిని గౌగిలించుకొని) బిడ్డా ! నీవు బాలికవయినను ననన్యసామాన్య భక్త్యతిశయంబున విరాజిల్లు పరమభక్తురాలవు. నీ స్నేహంబున నా కొొదవిన సంసార క్లేశములనెల్ల మఱచితిని. నీరాక మా కెంతయు శుభప్రదమయ్యె. నినువీడి నే నెట్లసువుల భరింపఁగలను? తల్లీ ! కనుగందువే ! ఈ వృత్తాంతమువిన్న నీతండ్రి యింకను జీవించునా ? అమ్మా ! నేనేమి చేయుదు. (జనాబాయి వెంబడి నందరు నిష్క్రమింతురు. యవనిక జారును)

(చతుర్థాంకము సంపూర్ణము)

---

# భక్త జనాబాయి

## పంచమాంకము

---

### ప్రథమరంగకము

( వధ్యభూమి )

(శృంఖలాబద్ధయగు జనాబాయిని భటులు గొనివత్తురు.)

జనా : కృష్ణా ! కృష్ణా !! నే నేమి యపరాధ మొనర్చితిని ! నా కీ ఘోర శిక్షయేమి ? నే ననపరాధను. అబలను. అనన్యసహాయను, నీవే దిక్కు. రంగా ! రంగా !! నా కేల యిట్టిగతి గల్పించితివి ? ఆబాల్యము నీ సంకీర్తనామృతమును గ్రోలుచుండినందులకా ? యీ యకాలమరణము ! లేక నీ భక్తారాధనము నిరంతరము సల్పుచుండినందులకా ? కాక, నా మొఱలు నీ స్వేచ్ఛావిహారము నకు భంగము గల్గించుననియా ? లేక నే నర్థార్థినై ధనధాన్య. ముల నాసించి నిను బీడించుచుంటిననియా ? స్వామీ ? నీ వెఱుగవా నా హృదయము ? నీ వేల సాక్ష్య మొసఁగవు ? దీన బంధూ ! దయాసింధుఁడవే. ఈ దీనురాలిపై నింత దయారసము చిమ్మరాదా ? సాయంసమయ మయినదాది నీ భోజనమునకై పదార్థములఁ బచించితి. నీకు వడ్డించితి. నీకుఁ దినిపించితి. కృష్ణా! కృష్ణా!! గోపాలకృష్ణా ! నే నాపూట నీ ప్రసాదమును స్వీకరింప మఱచి నిద్రించుచున్న తుద్బాధచేఁ బరుగిడివచ్చి నా పొత్తున భుజింపఁగంటివే. భక్తత్రాణ దీక్షాబద్ధకంకణ హస్తమున నా కన్న మును దినిపించితివె ? పిండి విసరుచున్నప్పుడు నా చేయి కందు నేమోయని నీవెవచ్చి విసరతివె ? ఇది యంతయు నిక్కువమా ? కాక, స్వప్నగత వృత్తాంతమా ! బాలకృష్ణుఁడవై సాక్షాత్క రించిన నాటి కరుణాకటాక్ష మిపు డేమాయె ? భక్తత్రాణుఁడ వయ్యు నా గో డేల యాలకింపవు ? కృష్ణా ! కృష్ణా !! రా వేమి?

రక్షింపవేమి ? నిష్కల్మష చిత్తంబున నీ పదాంబురుహంబులను హత్తించి, తద్రసామృత సేవనాకాంక్షనై బ్రతుకు నన్నే రక్షింపని వాఁడ వప్పట్ల ప్రహ్లాదాది భక్తతతి నెట్లు ప్రోచితివి? గజేంద్రుడు 'కుయ్యో!' యనఁగనె, "వివాదప్రోత్థిత శ్రీకుచోపరి చేలాంచల మయిన వీడక" పరుగెత్తితివఁట! ఇది సత్యమా! అస్థిరమై, మలభాండమయిన దేహమును వీడి మృత్యువు జయించుట కే నోడుటలేదు. నీ భక్తురా లిట్టి పాపియని లోకులాడు కూఁతలకు వెఱతును. నా వలన భక్తసంతతికిఁ జెట్టపుట్టునుగదా! నే నిట్లు మరణించిన 'జనాబాయి కపటభక్తురాలు. స్వామి ద్రోహిని'యని కవులెల్ల గ్రంథముల జాటరా? నా చరిత్ర నీచముగాఁ బ్రవర్తింపఁబడదా ? దీనరక్షకా! దేవకీనందనా! న న్నేమయినను జేసికొమ్ము. నీ పాదముల ఎడను నీ సంస్మరణ మానను.

(౧౫-వ అనుబంధము)

(పౌరులెల్లరు ప్రవేశించినపిదప, పఠేలు లరుదెంచును).

పఠేలు : ఈమె దోషియని మీ రెల్ల రెఱిఁగినదియె. ఇవిగో! యీ నగల నీమె దొంగిలించినది. ఈమె కింకెవరో తోడ్పడియుందురు. వారల నీమె తెలుపక పట్టుపట్టియున్నది. అట్టి కలుషాత్మురాలికి శిరశ్ఛేదన మొనర్పవలయును. అదియే శిక్ష విధించితిని. తలారీ! నీ వీమె శిరసు ఖండన మొనర్చుటకు సంసిద్ధముగానుండుము. జనాబాయి! ఇఁకనయినను దెల్పెదవా? లేదా ?

జనా : నే నేమియు నెఱుఁగను. ఇదియంతయు శ్రీ పాండురంగని చిద్విలాసము. జగన్నాటకసూత్రధారున కిదియొక రంగకము. జంత్రపు బొమ్మలవలె ని ట్లాడించుచున్నాఁడు. తన్ను దా మఱచి ప్రతిజీవి యీ నాటకమునఁ దత్తదుచిత భూమికను ధరించి యున్నాడు. నే నెఱిఁగినది తెల్పితి. ఇక మీ యిష్టము.

పశేలు : (క్రోధముతో) నీ మిట్టవేదాంతమును నీ మిథ్యావాదమును గట్టిపెట్టుము. (భటులనుజూచి) మీ రీమెను నేఱ మొప్పుకొను వఱకు దండింపుఁడు.

భటులు : (కొరడాలతోఁ గొట్టుచుందురు)

పశేలు : ఇది తన పెంకెపట్టును విడవకున్నది. తలారీ! ఇఁక నీ పనిఁ దీర్చికొమ్ము.

తలారి : అమ్మా! ఇదో! ఒక్కనిముసంలో దేవుని తలచుకో.

జనా :

శా. శ్రీకృష్ణా! యదువంశరత్న! సకలోర్వీనాథ సంస్తుత్య! రా
ధాకృష్ణా! ఋషిహృన్నివాస! సుజనోద్ధారా! మహాధీర! ధ
ర్మాకృష్టాత్మ! మహానుభావ! భవకర్మాతీత! యోగీంద్ర! ల
క్ష్మీకాంతా! కమలాక్ష! రావె నను రక్షింపంగ భక్తావనా!

తలారి : ఉ! చాలు చాలు సిద్ధముకమ్ము!

(తలారి జనాబాయి మెడపై వ్రేటు వేయఁబోగా ఖడ్గము భస్మమగును. తెరలోఁ బెద్ద ధ్వనియగును. వెంటనే దివ్యకాంతి వెలువడును. నామదేవులు, రాధాబాయి, జనాబాయి తక్కఁ దక్కినవారెల్ల రంధులగుదురు.)

శ్రీకృ : (సాక్షాత్కరించి) జనాబాయిని బట్టుకొని (౧౬ వ అనుబంధము) పౌరులారా! ఈ జనాబాయి నా భక్తురాలు. నేనీమె చరిత జగద్విదిత మగునట్లును, భూలోకమునం దాచంద్రార్కముగా వెలయుటకు నిట్టి విషమస్థితి గల్పించితిని. పరమపావనురాలగు నీ జనాబాయిని గొల్చి ధన్యులుగండు. మీరీమెను నిర్దోషినిగా మద్భక్తాగ్రేసరగాఁ దలంచిన మీకుఁ దిరుగ నయనదృష్టి గలుగును. జనా! నీ భక్తికి మెచ్చితిని. నీజన్మము తరించె. నీ జ్ఞానము ఫలించె. నీకును నాకును నభేదము. నీకి దేహాంతమున ముక్తి లభించును. అంతవఱకు జీవన్ముక్త వలెనే జీవిత శేషమును గడిపి, పిదప నాయం దైక్యము నొందుము. రే పిట

కరుదెంచు నీతండ్రి కనుసన్నల మెలఁగుము. సృష్టియే కర్మ. కర్మలను వదలవలయు నని యెంచినను వదలవు. కనుక నాత్మ జ్ఞాని చిత్త శుద్ధ్యనంతరము సయితము ఫలాశను వదలి ధైర్య ముతో, నుత్సాహముతో, సర్వ సత్కర్మల నొనర్పవలయును. నిష్కామమనఁగా నిష్క్రియకాదు. అతఁడు తన యావదాస్తిని స్వామి కైంకర్యమున కొసఁగియున్నాఁడు. కృతార్థుడైనాఁడు. భక్తి ఫలసారమును చవికొనినాఁడు. నీ చరిత వినినవారి కష్టము లీడేరును. పాపములు నశించును. మత్సందర్శనమున వీరును బాపరహితులగుదురు. నీకు శుభంబగు. నామదేవా! జనాబాయి వలె నీ సతియు బుణ్యాత్మురాలు. మీ యాదరణమున జనా బాయి తపము ఫలించినది. మీకు శుభంబగు. జనాబాయి! నీకేమి వరము కావలయునో కోరుకొనుము.

జనా : స్వామీ! పూర్వజన్మమున నేఁగోరిన వరము నేఁడు ఫలించె ఇంకేమి కావలయును. నిష్కామ బుద్ధితో నీ పదసేవన మొనర్పఁ జేయ బ్రార్థితులు.

శ్రీకృ : అదిసరి. మఱియేదైన నొక వరముఁగోరుము. ప్రసాదించెద.

జనా : భగవత్కృపావీక్షణమున నిట్లగుఁగాక!

తే. గీ. షావిభీతియు, దైవసంప్రార్థనంబు
గలిగి వర్తించు జనులను గన్నబిడ్డ
లవలెఁజూచుచు రాజులు రాజ్యమేలు
చుంద్రుగావుత సతతంబు శోభగలిగి.

మరియు

సర్వమానవ సౌభ్రాత్ర సరణి, శాస్త్ర
సమ్మతి, యహింసయందున నమ్మకంబు,
మాతృదేశానురక్తి, సన్మార్గవర్త
నంబు వెలయుత సచివ లోకంబునందు!

శ్రీకృ : అట్లగుఁగాక !

నామ : తథాస్తు!

మంగళము

(తెరపడును)

(పంచమాంకము సర్వంబును సమాప్తము)

గద్య

శ్రీహరిహరనాథ కరుణాకటాక్ష వీక్షణానులబ్ధ సుకవితావిచిత్ర భారద్వాజస గోత్రపవిత్ర, మహాకవి మేడిపల్లి నృసింహశాస్త్రి పుత్ర పర్వతాంబా గర్భశుక్తి ముక్తాఫల నవలానాటకహరికథేతిహాస గ్రంథరచనాప్రవీణ విద్వాన్, కవిరత్న, అష్టావధాని మేడిపల్లి లక్ష్మీకాంతప్రణీత శ్రీమజ్జనాబాయి నాటకమున పంచమాంకంబు సర్వంబు సమాప్తము.

శ్రీ శ్రీ

